Reg. No. 757

# అభినవసరస్వతి

మనోరంజక మాసపత్రిక.

అష్టావధాని జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.
జనపాడు.

సంపుటము 16 { 1925 సం॥ మార్చి } సంచిక 12



విషయములు.



చందాపట్టియము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry.

## చందాదారులు.

౧ పెనుమర్తి రామకృష్ణయ్యగారు, కారుమూరు.

౨ భువనగిరి కోదండపాణిగారు, సబిజేస్ట్రారు, తెనాలి.

౩ రాజరాజనరేంద్రాంధ్రభాషానిలయము, హనుమకొండ.

౪ దేవులపల్లి రామకృష్ణరావుగారు, పటేలు, వంగపాడు.

౫ రంగరాజు వరదయ్యగారు, వంగపాడు.

౬ జంధ్యాల శివన్నశాస్త్రిగారు, హిందీపండిట్, గుడివాడ.

౭ వేపచేదు వెంకటరామారావుగారు, చిరాన్నిముల.

౮ శాకమూరి నరసయ్యగారు, చిరాన్నిముల.

౯ చుండూరు సీతారామయ్యగారు, మర్చెంటు, బెజవాడ.

౧౦ తూములూరు కోటయ్యగారు, పినపాడు.

౧౧ బెల్లంకొండ హనుమంతరావుగారు, పమిడిపాడు.

౧౨ కన్నెకంటి చినలింగాచారిగారు, తక్కెళ్లపాడు.

౧౩ గడియారం వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి.

౧౪ చిరుమామిళ్ల లక్ష్మీనారాయణప్రసాదముగారు, డిప్టీకలెక్టరు.

౧౫ కాకుమాను సూర్యనారాయణగారు, మర్చెంటు, గుంటూరు.

౧౬ చించినాడ వెంకటరత్నశాస్త్రిగారు, బెజవాడ.

౧౭ పాలపర్తి గోపాలకృష్ణయ్యగారు, బెజవాడ.

౧౮ పాటిబండ వెంకటరమణయ్యగారు, బెజవాడ.

౧౯ చోడవరపు దేవరాజుగారు, కంట్రాక్టరు, బెజవాడ.

౨౦ సోమయాజుల నరసింహంగారు, బెజవాడ.

౨౧ పుచ్చా పట్టాభిరామయ్యగారు, తుమ్మలచెరువు.

౨౨ గుండిపూడి విశ్వనాథముగారు, సత్తెనపల్లి.

౨౩ పంచాగ్నుల సేతుమాధవశాస్త్రిగారు, పి. వి. ఆర్. స్కూలుపండిట్, వంగోలు

౨౪ కందుకూరు సూర్యప్రసాదరావుబహాదరుజమీందారుగారు, దేవాది.

౨౫ తులాబందుల చినబ్రాహ్మణయ్యగారు, వడ్డేశ్వరం.

౨౬ కంచెర్ల లక్ష్మయ్యగారు, ఫారెస్టరు, అడవులదీవి సెక్షన్.

౨౭ వేమూరి చెంచుకృష్ణయ్యగారు, స్కూలుపండిట్, నలదలపూరు.

౨౮ పసుమూరి చినకోటయ్యగారు, బేతపూడి.

౨౯ ఇంద్రకంటి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కర్నూలు.

# దుర్గా ఋషికుల విద్యాశాల.

ఈవిద్యాశాల దుర్మతి సం॥ శ్రావణ శు ౧౦ సూర్యనారాయణ సోమయాజులవారి భార్య రాయప్రోలు శేషసోమిదేవమ్మగారిచేఁ బ్రతిష్ఠింపఁబడియె. విద్యార్థులము పండ్రెండుగురము కలము. దీనియందార్ష మార్గవిహితమగు విద్యనే నేర్పఁబడును గాన దీనికి ఋషికుల విద్యాశాల యను నన్వర్థనామకరణము గావింపఁబడి విద్యార్థులకు గీర్వాణభాషాభ్యాసము కావింపఁబడుచున్నది. దీనికిఁ గీ॥ శే॥ లింగమల్లు పాపయ్యగారి భార్య రామలక్ష్మమ్మగారిచే సుమారు రెండువేల రూప్యముల కిమ్మతుగల భవనమొకటి నిర్మింపఁబడి రెండుపుట్ల ధాన్యము పాఠశాలకు ధర్మముగా నీయఁబడుచున్నది. తాడేపల్లి వెంకట సీతారామానుజమ్మగారిచే భోజనశాల యొకటి కట్టింపఁబడినది. మా పాఠశాలోపాధ్యాయులగు బ్ర॥ అవ్వారి శ్రీరామమూర్తి శాస్త్రిలవారు ప్రథమమునుండి మాకు సంస్కృతభాషాప్రవీణత సులభముగాఁ గలుగునట్లు మాచే సంస్కృతపాఠపుస్తకములను స్వల్పవ్యాకరణమును బఠింపఁజేయుచు సంస్కృతమునుండి తెలుఁగునకును తెలుఁగునుండి సంస్కృతమునకును భాషాంతరీకరణములఁ జేయించుచు భాషాభిజ్ఞులఁ జేయ నిశ్చయించినందుకు వారి కనేకవందనము లర్పించుచున్నాము. ఇఁక మాకు సంధ్యావందనము నగ్నికార్యము స్మార్తము మొదలగు వానిఁగూడఁ జెప్పించి యాచరింపఁజేయుదురను విషయమును విని మిక్కిలి సంతోషింపుచుఁ బాఠశాలలన్నియు నిట్టిమార్గమవలంబించిననే కాని బ్రాహ్మణ్యము బాగుపడనేరదనియు, ఆస్తికతాబుద్ధి యంకురింపనేరదనియు మనవిచేయుచున్నారము. కొందఱు విద్యార్థులన్నవసతిలేనివారగుటచే శ్రీ సోమిదేవమ్మగారు ప్రతియింటఁదిరిగి బియ్యము ప్రోగుచేసి వండిపెట్టుచు మాకన్నవసతి కల్పించినందు కామెను గన్నతల్లికంటె నెక్కుడుగా స్మరించుచున్నాము. డెబ్బదియేండ్ల వయసు కలిగి తిరుగలేనిసమయమున నింతకార్యము నిర్వహించుచున్న యామెను జూచి యందఱును నేర్చుకొనవలసినవారలై యున్నారు.

బెజవాడ. }
ఇట్లు విన్నవించు విద్యార్థులు,
పట్లమాని సూర్యభాస్కరశర్మ ప్రభృతులు.

# అభినవసరస్వతి

సంపుటము ౧౬ { జానపాడు
రక్తాక్షి సం॥ ఫాల్గునమాసము. } సంచిక ౧౨

## పీఠసంగ్రహచరిత్ర విమర్శనము.

ఈ శ్రీశృంగేరి శ్రీవిరూపాక్షసంస్థాన శ్రీపీఠసంగ్రహచరిత్రమును సికింద్రాబాదు పురస్థితాశేషవిద్వన్మహాజనసభానుమతిని పాకయాజిగారును నాగము కృష్ణరాయశర్మ గారును గలిసి రచించిరఁట. నిఖిలదేశవాసులగు శ్రీపీఠశిష్యబృందమునకును విశదమగుటకై యచ్చటి శిష్యబృందము ముద్రింపించి ప్రకటించిరఁట. శ్రీశృంగేరి శ్రీవిరూపాక్ష సంస్థాన శ్రీపీఠసంగ్రహచరిత్రమును సికింద్రాబాదుపురస్థిత విద్వజ్జను లందఱుం దెలిసి కొనుటయేకాక సకలదేశజనులకుం దెలియఁజేయ వీరిసాహాయ్య మపేక్షించిరి కాఁబోలు. అట్టిచో సికింద్రాబాదుపురమున భిక్షలుచేయువారులేక శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్షసంస్థాన శ్రీపీఠమున కధ్యక్షులైన శ్రీ బోధానందభారతీస్వాములవారు విదేశముల కేలయేగవలసి వచ్చినదో తెలియరాకయున్నది. అయితే శ్రీశృంగేరి శ్రీవిరూపాక్షసంస్థాన శ్రీపీఠచరిత్రము బోధానందభారతీస్వాములవారి తదధ్యక్షతయు విద్వజ్జనులకుమాత్రమే విదితమై యన్యుల కవిదితము కాఁబోలు. అందఱికిం దెలియుటకు విద్వజ్జనులు సభచేసి పీఠసంగ్రహచరిత్ర వ్రాయుఁడని పాకయాజిగారి కాజ్ఞయిచ్చుటయు వారు వ్రాయుటయు నది యచటిశిష్యబృందము ముద్రింపించి ప్రకటించుటయు నయ్యెనుగదా! ఇంకెందుల కీస్వాములవారికి భిక్షలు జరుగకపోవలయును? “ సత్యమేవ జయతే నానృత ” మ్మని ప్రతివ్యాసారంభమునను వ్రాయు పాకయాజిగారి శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్షసంస్థాన శ్రీపీఠసంగ్రహచరిత్రలోని సత్యము “ సికిందరాబాదుపురస్థితాశేషవిద్వన్మహాజనసభానుమతి ” నన్నపంక్తివలననే తెలియనయ్యెడిని. తమరును దమగురువులును దమబోటు లొకరిరువురును గలిసి యనుకొనుట సత్యము. ఆశేషవిద్వన్మహాజనసభానుమతి యసత్యము. అభినవవిరూపాక్షపీఠమనుట సత్యము. శ్రీశృంగేరి శ్రీవిరూపాక్షసంస్థాన శ్రీపీఠమనుట యసత్యము. అగ్రిపత్రిమే యిట్లసత్యభూయిష్ఠము కా నవశిష్టచరిత్రము నడుగనేల? ఇది యసత్యమనుటకు నీ వేమిఋజువుచేసితివని యడుగకుఁడు. సికిందరాబాదువంటి పెద్దపట్టణములోని విద్వన్మహాజను లొక్కరేని బీఱువోక యందఱును సభచేసి చరిత్రవిదులగు వీరిచే నీగ్రంథము వ్రాయించుటయు నిఖిలదేశవాసి శిష్యబృందమునకును విశదమగుటకై తత్రత్య శిష్యబృంద మచ్చొత్తించి ప్రకటించుటయు నీ వత్స

రములనాఁడే జరిగియుండ నిప్పటికిఁ బెక్కండ్రిది యెఱిఁగియుండవలసియున్నది. అట్లు లేదు.

ఎటువచ్చియు గుంటూరుపురంబునం జేరి కల్యాణానందభారతీస్వాములవారు మహాశ్రీముఖములు ప్రచురించుచున్నప్పటినుండియుఁ బాకయాజిగారు శ్రుతిధర్మసంజీవినీముఖమున రెండవమారు శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠసంగ్రహచరిత్రమును బ్రకటించిననాఁటినుండియుఁ గొంతజనమున కీవిషయము వినవచ్చెడిని. అదియు " అనార్యసంగమా ద్వరం విరోధోఽపి సమం మహాత్మభిః " అను నార్యోక్తి ననుసరించి పుష్పగిరిపీఠాధిపతులతోఁ బ్రతిఘటించుటవలనను వారు గుంటూరుమండలమునందే సంచరించుటవలనను వీరెవ్వరు వీరిచరిత్రయేమి యని లోకులకు జిజ్ఞాస కలుగవలసివచ్చెను. అట్లు కలిగి విచారింపఁగా బోధానంద కల్యాణానందభారతులకు సక్రమముగా సంక్రమింపకున్నను సంక్రమించినదని వారనుకొనుచున్నది యభినవవిరూపాక్షపీఠమని తెలియనయ్యెను. ఇట్లు సులభముగాఁ దెలుపఁదగిన చరిత్రను బాకయాజిగారు ద్రావిడప్రాణాయామమువలె శ్రీశృంగేరి శ్రీవిరూపాక్షసంస్థాన శ్రీపీఠసంగ్రహచరిత్రమని శ్రీకారత్రయవిశిష్టముగా నింతపొడుగు పెంచి వ్రాసి లోకులను గలవరపెట్టఁబూనిరి. ఇదియునుంగాక యీ శ్రీశృంగగిరి విరూపాక్ష శ్రీపీఠసంగ్రహచరిత్రమునకు శ్రీవిద్యారణ్యస్వాములవారిచే స్థాపింపఁబడిన యను విశేషణముగూడ నొకటి తగిలించిరి. శ్రీవిద్యారణ్యస్వాములవారిచే స్థాపింపఁబడినది శ్రీ శృంగగిరి విరూపాక్ష శ్రీపీఠమో తత్సంగ్రహచరిత్రమో పరల వారినే యడిగి తెలిసికొనవలయును. ఇచ్చటి శబ్దప్రయోగమును బట్టి శ్రీవిద్యారణ్యస్వాములవారిచే స్థాపింపఁబడినది శ్రీశృంగగిరివిరూపాక్ష శ్రీపీఠసంగ్రహచరిత్రమేయని విజ్ఞులకర్థమయ్యెడిని. కాని శ్రీశృంగగిరి విరూపాక్ష శ్రీపీఠసంగ్రహచరిత్రమునకు విద్యారణ్యస్థాపితత్వ మసంభవము. స్థాపింపఁబడిన యనుదానికి లక్షణచేతనో యౌచిత్యమునుబట్టియో ప్రకటింపఁబడిన యని కాని విరచింపఁబడినయని కాని యర్థముచేసికొనినచోఁ బాకయాజిగారువహించుకొనిన నేత ద్గ్రంథకర్తృత్వమును సికింద్రాబాదుపురస్థ శిష్యబృందము నెత్తినిబెట్టఁబడిన ప్రకాశకత్వమును నిరర్థకములు కావలసివచ్చును. ఈశబ్దచర్చ యిట్లుండనిండు.

పాకయాజిగారు గ్రంథోపరిభాగమునను గ్రంథారంభమునను గీర్తించిన గ్రంథనామాదికం బర్థమునకును యథార్థమునకును దూరమైయుండుటవలన నింతపర్యంతముఁ దత్స్థలంబుననే పరామర్శింపవలసివచ్చినది. ఇందు బోధానందకల్యాణానందభారతులు తమకు సంక్రమించినదని యనుకొనుచున్న కాకరపర్తిపీఠము శ్రీశృంగేరి శ్రీవిరూ

సాక్షు శ్రీపీఠము కాదనియు నభినవవిరూపాక్షపీఠమనియుఁ జెప్పియుంటిమి. అందుల కాధార మెద్దియన: అన్ని జగద్గురుసంస్థానములలోనను శంకరాచార్యులను మొదలుచేసి తాత్కాలికాచార్యులవఱకుఁ గల గురుపరంపరయుఁ దత్తదాచార్యుల చరిత్రమును వ్రాసిపెట్టఁబడియుండును. అవి ప్రాఁతగిలినకొలఁది మరలవ్రాయించుటలోఁ గలిగిన లేఖకప్రమాదమునకో యెటులో కొన్ని యొకటికొకటికి భేదించికూడ నుండుచుండును. అందు శృంగగిరిది యాదిపీఠమైనందున విచికిత్సగలిగినప్పుడు విమర్శకులు తత్పీఠస్థ గురుపరంపరనే ప్రమాణముగఁ గైకొనుచుందురు. అచ్చట శంకరాచార్య ప్రభృతి పరిష్కృతాచార్యునివఱకుఁగల స్వపీఠాచార్యపరంపరగాక తక్కటిపీఠములది యుండునో యుండదో తెలియదు. ఒకరిదినొకరు సంగ్రహించి యుంచుకొనుట గూడఁ గలదు. చరిత్రకారులు కొంద ఱీయీగురుపరంపరలను జరిత్రములను సంపాదించి పరిశీలించి ప్రకటించికూడ నున్నారు. కాకరపర్తిపీఠము నవీనమగుటచే నేతచ్చరిత్రలేఖనమున కింతవఱకు నెవ్వరును గడంగియున్నటులఁ గనుపట్టదు. విరూపాక్షు శాఖకుఁ జేరినదగుటవలనఁ దత్రత్య గురుపరంపరయే దీని యానుపూర్వ్యము గుర్తించుట కాధారము కావలయును. ఆవిరూపాక్షపీఠమునకు మూలపురుషుఁడు విద్యారణ్యులు. శృంగగిరిపీఠస్థ గురుపరంపరనుబట్టియు శంకరాచార్యనామయాని భాషాంతరగ్రంథంబు లంబట్టియు నా విద్యారణ్యులు శంకరాచార్యులవారికి ౧౨వ పురుషులు. తదాది ౪౦వ పురుషుఁడగు నుద్దండనరసింహభారతీస్వామివారలముతో నీకాకరపర్తిపీఠ మనునది యేర్పడి యభినవవిరూపాక్షపీఠమని వ్యవహరింపఁబడుచున్నట్లు విరూపాక్షపీఠస్థ గురుపరంపరవలనఁ దెలియనయ్యెడు. గోదావరీమండలజనులును నిట్లే చెప్పుచున్నారు.

అట్లాయభినవవిరూపాక్షపీఠ మభినవోద్దండనరసింహభారతీస్వాములవారి కాలమం దావిర్భూతమై యేలూరుమొదలు జగన్నాథప్రాంతమువఱకు నాచారవ్యవహారములఁ బాలించుచు నలరారుటయుఁ దన్మధ్యదేశగత విజయనగరసంస్థానికులు మైసూరు సంస్థానికులు శృంగగిరిపీఠము నెడలఁ జూపెడు నభిమానమును జూపుచు సంప్రదాయమునకుఁ జనని కాలమునఁ దప్పనిక్కయములఁ దామే యర్పించుచుఁ బోషించుచు వచ్చుటంజేసి కొంతవఱకు కీర్తిపీఠమునకు విజయనగరపీఠమనికూడ వాడుకవచ్చెను- అట్లు రానురా నిప్పటి కిరువదిముప్పదివత్సరములక్రింద విజయనగరప్రాంతములనే యిప్పటి తత్పీఠాచార్యుఁడు సిద్ధిఁబొందుటయు నావిజయనగరమహారాజు స్వాస్థానవిద్వాంసులగు నెనమండ్ర నరసింహశాస్త్రిగారిని బలవంతపెట్టి తత్పీఠమున నధిష్ఠింపించిరి. అట్లు తత్పీఠాచార్యులై వారు విద్యానృసింహశంకరభారతీనామమున విరాజిలుచుఁ గొంతకాలము పాలించుటయు నిప్పటికి ౧౨సం॥ల క్రింద గోదావరిజిల్లా రామచంద్రపురముతాలూకా సంస్థ

పేటగ్రామములో బలరాజాద్యములవలనఁ గాయమును వదలవలసినవారై యవకాశము లేమి సన్యాస కండలి యాచార్యత్వ మిచ్చి యధిష్ఠింపఁజేయరైరి. అంత నాపీఠమును ౧౧ దినములకు రాణీ నరసింహచయనులుగారను నొక రామందపేట గ్రామవాస్తవ్యులగు కొందఱు బ్రాహ్మణుల యంగీకారముతో నాక్రమించుకొనిరి. వారే యీ బోధానందభారతీస్వాములవారు. వీ రంతకుఁబూర్వమే మఱియొకరియొద్ద సన్యసించి బోధానందభారతీనామవాచ్యులై యుండుచున్నవారు. అట్లు బోధానందభారతీస్వాములవారు తత్పూర్వాచార్యులగు విద్యానృసింహశంకరభారతీస్వామి కరకమలసంజాతులు కాకయే కాకరపర్తి పీఠ మాక్రమించుటయు శివానందులను స్వాములవారు తచ్ఛిష్యుఁడనగు నేనెక్కవలసినపీఠమును నిట్టులెక్కితివని బోధానందభారతిపై వ్యాజ్యము వేసెఁగాని తగువిధమున బుజువుచేసికొనలేకపోవుటచే నది త్రోసివేయఁబడెను. [సశేషము]

## బహిరంగవిజ్ఞాపనము.

...పంచమజార్జి సార్వభౌములకును భరతఖండ స్వదేశసంస్థానాధీశులకును... ఘనతవహించిన రీడింగుప్రభువుగారికిని... మాననీయులగు పార్లమెంటుసభ్యులకును... శాసనసభాసభ్యులకును

ప్రాచీనసంప్రదాయాచారపరాయణులము... చేయువిజ్ఞాపనము.

వైదికసంఘము... వేదశాస్త్రనియమలక్షణములకు లక్ష్యభూతమయి... వర్ణాశ్రమధర్మసమన్వితమైయున్నది. ఈవర్ణాశ్రమధర్మమునందే మతసాంఘిక రాజకీయములను త్రివిధప్రవృత్తులు... ఈ వైదికసంఘము మతసాంఘికవిషయముల... పౌరుషేయ... అభిప్రాయముల నంగీకరించుటలేదు... ఎట్టిపరిస్థితులందును... తన మతసాంఘికనియమముల మార్చుకొనునెడల... వైదికసంఘమున... చేరినవాఁడు గా...ను. శాస్త్రములననుసరించి ప్రభుత్వము... ౧ జాతిప్రయుక్తమైనది. ౨ (క్షత్రియత్వము) బలప్రయుక్తమైనది. 3 సేనాప్రయుక్తమైనది... అని త్రివిధము. ఆంగ్లేయులు భరతఖండమున ... ప్రవేశించు... పూర్వమే మొదటిరకముప్రభుత్వ మస్తమించి రెండవరకమయిన ప్రభుత్వమేతత్ స్థానమునకు వచ్చియుండెను. ఆంగ్లపరిపాలకులు... పూర్వమునందున్న పరిపాలకుల నుండి ప్రభుత్వాధికారమును గ్రహించునప్పుడు తత్పూర్వప్రభుత్వములయందు...స్వ మతసాంఘిక...హక్కుల...ప్రజలకే వదలిరి స్వదేశీయపరిపాలకులు పరస్పరము కలహించుకొనుచు దేశమును సంక్షోభపెట్టుచుండుటచేత...ఆంగ్లపరిపాలకులు సామ్రాజ్య

భారమును వహించుటరవలసి...వచ్చినది. జగద్విఖ్యాతికెక్కిగల విక్టోరియా మహా రాణి...ఆ కాలము...ప్రజల...సంస్థానాధీశుల ... హక్కులనన్నిటి... తాను...తన సింహాసనమునధిష్ఠించువారలును గౌరవించెదమని...బహిరంగవాగ్దానమొసంగియుండిరి. సంస్థానాధీశ్వరుల హక్కులుమాత్రము యథాపూర్వముగా వారియందే నిలిచియున్నవి. కాని సంఘసంస్కర్తలమని చెప్పుకొనువారి విపరీతబోధలవలన ... హిందూజనుల... హక్కుల...ప్రవేశించుచు...ఆంగ్లేయులు హిందూసంఘపరిస్థితుల గమనింపక... ఆమోదించుచున్నారు.

...రాజకీయ విషయములయందు ... రుచికలిగిన ప్రజలు తాము రాజ్యభార నిర్వహణమునకు సమర్థులమైతిమని తలంచుచు ...రాజ్యభారనిర్వహణము... కోరుచున్నారు. వీరికోరికననుసరించి ప్రభుత్వమువారు మాంటేగుచెమ్స్‌ఫర్డు సంస్కరణ రూపముగ...హక్కుల నొసంగినటు...చెప్పుచున్నారు... హిందూమతాచారధర్మములందు... తగిన పరిజ్ఞానముగాని శ్రద్ధగాని లేకపోవుటచేత...అట్టి మతాచారధర్మములను గూర్చిన హక్కు...ఇట్టి పరిస్థితులలో... రాజకీయవిషయములందే హక్కుగల వీరికి ...ఇచ్చుట యసంభవము. నానావిధమతవర్ణముల... చేరినవారి కూటమియే ప్రభుత్వాధికారమునకు వచ్చుటవలన...మతవిషయ... హక్కులను దేశీయులు కోరుటకు వీలులేదు. స్థితిగతు లిట్లుండ...శాసనసభ్యులలో...విచ్చలవిడి...హిందూసంఘమతాచార ...ప్రవేశము కలిగించుకొనుట... అత్యంతాశ్చర్యముగ నున్నది... మితవ్యయజీవనము స్వస్వమతధర్మముల నాచరించుటయందు...శ్రద్ధయు వైదిక సంఘమునకు...స్నపి. ఇట్టి స్వభావముగలజనుల...పాలించునపుడు వారి సహజములగు గుణములను వారు రక్షించుకొనునటు...తోడ్పడుట యత్యావశ్యకము. బ్రిటిషుపరిపాలకులు పైరెంటిలో మొదటిదగు మితవ్యయజీవనమును...నిర్వహింప...క పోయినను రెండవదానినిమాత్రము ...సంరక్షించుచున్నారు...ఈసుగుణమువలననే వారిపరిపాలన మా దేశమున స్థిరపడుట కవకాశమైనది... వైదికసంఘీయుల సాంఘికవిషయములతో జోక్యము కలిగించుకొనుట మతవిషయములతో జోక్యముకలిగించుటయేయను పరిజ్ఞానము... లేకపోవుటచేతనే ప్రస్తుతశాసనసభలయందు మతవిషయములు ...చొప్పించుచుండుట...అగుచున్నది. ఆ కాలపు హిందూరాజుల పరస్పరద్వేషము తమరు...ప్రవేశించుటకు... తోడ్పడినను వైదికధర్మమునే జయించుతలంపుతో భరతఖండమునకు వచ్చిన మహామ్మదీయు లిచట...రాజ్యమును స్థాపించుట కెంతయో కాలము పట్టెను... ఎవరైనను హిందూదేశవాసులగు ప్రజలయొక్క మతసాంఘికధర్మముల నుపేక్షించి తృప్తికరముగ భరతఖండము...పాలించుటయనునది యసంభవము... ఏనాటికైనను...వృద్ధి

నందుటకు హిందూదేశము...అనుకూలమయియున్నది. ఈమతవిషయకమగు దృఢవిశ్వాసము కేవల మొక వైదికసంఘమునకే కాదు. ఇతర దేశములందున్న మహమ్మదీయులకంటె హిందూదేశమహమ్మదీయులు తమమతమునందు ...పట్టుదలకలిగియున్నారు...హిందూదేశములో...ఇతరమతస్థులు... ఇట్టిపట్టుదలగలవారలే. ఇట్టి... హిందూదేశమున.....ప్రభుత్వమువారి యుపేక్ష.....సంస్కర్తలమనుకొనువారు హిందూమత...హక్కులతో జోక్యము... జేసుకొనుట...అధికసంఖ్యాకులగు హిందూమహాజనులహృదయమున...ప్రభుత్వాధికారుల విషయమయి దురూహకలుగుట కవకాశమిచ్చుచున్నది....ఈపొరబాటు... సవరించుకొనునెడల... ఆంగ్లదేశముయొక్క శాశ్వతఖ్యాతి... ప్రపంచరాజకీయచరిత్రమునందు...ప్రకాశించుచుండును... మనుష్యుని యభిప్రాయములు... ప్రియాప్రియములును... సహవాసముచేతను బాల్యమునందునడచిన రీతిచేతను...అభ్యసించిన విద్యచేతను...ఏర్పడుచున్నవి. బాల్యమునందు... పరిజ్ఞానము పరిచయము లేని మతవిషయమునుగూర్చి వయసుముదిరిన తరువాత...ప్రారంభించిన యెడల... ముందు మనసునందు స్థిరమయియున్న యూహల కనుసారముగనే గ్రహించునుగాని యథార్థస్థితిని గ్రహించ...డు. తనయందు వ్యామోహముగల తన శిష్యవర్గముచేత మహాత్ముయని పొందిన బిరుదమును సార్థకముచేసికొనుటకయి తన... చదివినచదువు...ఆధారముచేసికొని హిందువులమతముపై శ్రీయుత గంధిగారుచేయుచున్న యపసిద్ధాంతములనే...ఉదాహరణముగ...పరిగ్రహించవచ్చును. శాసనసభ్యుల ...పలువురు మతవిషయజ్ఞానవిహీనులుగనో మతవిషయక శ్రద్ధావిరహితులుగనో విపరీతజ్ఞానులుగ...నున్నారు. దేశముయొక్క రాజకీయ...విషయముల విచారించుటకే యీసభ్యులు...ఇందులకు...విరుద్ధముగ శాసనసభలయందు మతవిషయము... తెచ్చుటయు వాని...చర్చించుటయు జరుగుచున్నది.... కొందఱు మితవాదులని...ఉదారవాదులనియు స్వతంత్రవాదులనియు జాతీయవాదులనియు మఱికొందఱు సహాయనిరాకరణులని...పరస్పరము భేదముకలిగియుందురుగాని...చూచిన దేశహితమను నెపముతో హిందూసంఘముయొక్క మతసాంఘికవిషయము .. తిరస్కరించుటయందుమాత్ర మందఱేకాభిప్రాయముగలవారలై యున్నారు...గంధిగారు తనను...కాంగ్రెసునకును లోకమునందు... పలుకుబడియున్నంతవఱకు...హక్కులను వదలుకొనుట రాజకీయావశ్యకతయని చెప్పిరి. తనకు... తనకాంగ్రెసునకు ...పలుకుబడిపోయిన తత్క్షణమే గత్యంతరములేక మతవిషయమునందు స్వయంనాయకత్వమును వహించినవారై చాతుర్వర్ణ్యములవారు తమ...హక్కులను వదలుకొనుట మతవిషయావశ్యకమని చెప్ప మొదలుపెట్టినారు. ఇప్పటికాంగ్రెసు గాంధిగారిని విడి... ఉండకపోవుటచేత...

దేశమునం దింతవరకుండు తానున్న సంపూర్ణప్రాతినిధ్యము... కోల్పోయినది...తిరిగి కాంగ్రెసునకు దేశమునకు సంపూర్ణప్రాతినిధ్యము రావలయునన్న గాంధిమతమును వదలినయెడల...అవకాశమునందును... హిందువులయొక్క మతసాంఘికవిషయములందు రాజకీయశాసనముచే... మార్పును...జేయవలెనను తలంపుతో... శాసనసభయందు హిందూమతధర్మ... అనర్థదాయకములు.. తదితరుల మతవ్యవహారపరిస్థితుల...ఆవశ్యకముల...కోరనివియు...అగు గౌరుగారు తెచ్చిన ...బిల్లు ..మదరాసు శాసనసభయందలి ధర్మాదాయపుబిల్లు...అస్పృశ్యతానివారణమునుగూర్చిచేయుచున్న చట్టముల...చూచి శాసనసభలునైతే మళ్లీ యున్నవని మేము తలచుచున్నారము ..ఇండియాయందున్న రాజకీయవాదుల...అనేకులు శాసనసభలయందున్నను వెలుపలనున్న...పాశ్చాత్య సంప్రదాయానుసారము విద్య నభ్యసించియున్నారు.

కనుక వీరు... బ్రహ్మసమాజికులుగ ... ఆర్యసమాజికులుగ...నున్నారు. లేక సనాతనధర్మపరాయణులవలె నటించుచు ..లోలోపల వారిపక్షమునకు సహాయకులుగా ...నున్నారు...వీరు తమ ..పలుకుబడి...తమయిష్టానుసారము భావించుకొనుచున్న సంఘసంస్కరణప్రచారార్థము దురుపయోగము చేయుచున్నారు. ఇది సంఘమునుగాని లేక క్రొత్త...దేశీయరాజ్యమునుగాని సమూలముగ నశింపజేయుటతో ... అంతమగును...పత్రికలన్ని...ఈరకము మనుష్యులకు సంబంధించియున్నవి. ప్రతిపత్రిక... ఒక్కొకవిధమయిన రాజకీయాభిప్రాయముగలది... ఇతరపత్రికలతో రాజకీయవిషయములందు భేదించును. కాని తమతమ మతసాంఘికధర్మముల...అభిప్రాయము...ఉపయోగము... ఎటులంగనవగుటచే...అతిప్రాచీనచాతుర్వర్ణ్యమతధర్మములమాత్ర మేకగ్రీవముగ నిరసించుచున్నవి... లోకవార్తలు రాజకీయాభిప్రాయములు...తమ మతసాంఘికాభిప్రాయముల...ప్రకటించుటయందు...శక్తిని ధారపోయుచున్నవి...సంఘసంస్కర్తలమనుకొనువారు వారిసిద్ధాంతముల...ప్రజలకు బోధచేయు హక్కునుగూర్చి మే మాక్షేపించుటలేదు...జనసామాన్యము...పై...శాసనము...జొప్పించుటయందు ...మార్గమునే మే మాక్షేపించుచున్నాము. పూర్వకాలమందు ... శాస్త్రవిరుద్ధాచారులు తమ యశాస్త్రీయసిద్ధాంతములతో సంఘమున...కళంకము...జేయునప్పుడు ...వారిని సులభముగా బహిష్కరించుటకు సంఘము సమర్థమయియుండెను. ప్రకృతము ... మతసాంఘికసంప్రదాయాభిజ్ఞులగు సంస్కృతభాష నెఱింగినవారలకు ... ఆంధ్రాది దేశభాషాభిజ్ఞులకు ..ప్రభుత్వాదరణము లేనందువలన...పలుకుబడియే లేదు.

విద్యాసహవాసవశముచేత హిందూమతవిరుద్ధాచారములయం దభిరుచిగలిగి,.. ఇంగ్లీషు విద్యావంతులు తామాచరించు... విషయము...అన్యమతమునకు సంబంధించియున్నను... యన్యమతమునందు...చేరినవారమని బహిరంగముగ నంగీకరింపక హిందూసంఘసంస్కర్తలమను పేరును...పెట్టుకొనుచున్నారు...యథార్థముగా సంఘసంస్కర్తలనువారు హిందూసంఘమునం దుండుటకు వీలులేదు.

ఆంగ్లేయోద్యోగులు తమతో సమానమయిన...ఇట్టితరగతివారియందే ప్రీతిగలవారగుచున్నారు. ఇట్టియనుకూలపరిస్థితులవలన వారు తమ...రాజకీయప్రాతినిధ్యమును సంస్కరణమను పేరుతో సంఘమును మార్పుటయందు దుర్వినియోగముచేయుచున్నారు ...డాక్టరు గౌరుగారి...ఇండియన్ పినల్ కోడు 395, 396 సెక్షనుల సవరణచట్టము వైదికమత (హిందూ) షోడశసంస్కారముల...ప్రధానమును మొదటిదియు నగు గర్భాధానసంస్కారముతో...ఐక్యము కలిగించుకొనుచున్నది. హిందూమతమునకు సంబంధించిన కృత్యముల...కొన్నింటికి...సంస్కారములని పారిభాషికనామము. ఇవి మనుష్యులయొక్క జన్మపవిత్రతకు. ఏర్పడినవి... కేవల ... ఐహికఫలములకే గాక... పారలౌకికసౌఖ్యమునకు...ఏర్పడినవి ... ప్రతిసంస్కారము...చేయవలసిన కాలమును రీతిని శాస్త్రములు శాసించుచున్నవి. పరాశరస్మృతి... శ్లో॥ ఋతుస్నాతాంతు యో భార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి ఘోరాయాం భ్రూణహత్యాయాం యుజ్యతే నాత్ర సంశయః॥ భర్త...కలియుటకు ..కాలమని తెలుపు ప్రకృతిసూచనయే రజోదర్శనము. ఈ పైయభిప్రాయమునే బృహస్పతి యాజ్ఞవల్క్య బోధాయన దేవల...వ్యాసగౌతమాది స్మృతికర్తలును.. నిబంధనగ్రంథకర్తలును చెప్పియున్నారు. అతీంద్రియార్థపరిజ్ఞానులైన ధర్మశాస్త్రకర్తలును సర్వజ్ఞులైన వేదభాష్యకర్తలును గర్భాధానసంస్కారయోగ్యకాలారోగ్యాది పరిస్థితుల ... తెలిసికొనలేదని ... అనేకసహస్రసంవత్సరముల తరువాత...సంఘసంస్కర్తృనామధారకులీమతసంస్కారనిర్ణయమునకున్న లోపము... కనిపెట్టిరనుటకన్న...హాసనీయ మింకొకటిలేదు...ఋతుకాలము బాలికయొక్క 12, 13, 14, సం॥ వయస్సు ననుసరించియుండదు...కనుక బాలికలయొక్క సరియగు గర్భాధానవయోనిర్ణయము ఋతుకాలముగానే యుండవలయును...సాధారణముగా ...దగినకాలమునకు బాలికలు ఋతుమతులు కానియెడల నారోగ్యవతులుగ నున్నను గర్భాధానమునకు...ఆరోగ్యములేదని తేలుచున్నది. గర్భాధానము.. తగియున్నదనుటకు సూచకముగా...బాలికలు సకాలమునకు ఋతుమతులగుచున్నారు...యుక్త

వయస్సువచ్చినతరువాత...పిల్లయొక్క దేహారోగ్యము సంగాలేనియెడల...తలిదండ్రులు ...కార్యముచేయక నిలిపియుంచుచునే యున్నారు. ఈమహాకలికాలమునందు బిడ్డల యందు...తల్లిదండ్రులకు స్వభావముగ నుండు ప్రేమ లేకపోవునట్టి...స్థితి సంభవించు నెడల...ప్రభుత్వమువారు...ఉద్యోగస్థులయందు ... సృష్టించ...తలంచుట వెఱ్ఱిగా నున్నది...శాస్త్రవిశ్వాసముగల హిందూసంఘమునకు ..గల పాతివ్రత్యము...చాల విలక్షణమయియున్నది...భర్తకు ..తత్తోవ్వవర్గమునందుండువారికి ..సేయు పరిచర్యచే ...ఇహాపరలోకములందు .. ఉచ్ఛస్థితినంతయు స్త్రీలు పొందుచున్నారు...ఈపరిచర్యనే శాస్త్రములు పాతివ్రత్యమని చెప్పుచున్నవి...హిందూబాలిక మతగృహకృత్యములయందు భర్తకు సహాయురాలుగ నుండుటకు నేర్చుకొనవలసియున్నది. భర్తయందు ...అత్తమామలయందు...అతనికుటుంబమున...సేవకవారియందు ... ప్రీత్యుపకృతి... కోరని...రాగబంధమును హిందూబాలిక ప్రియపూర్వకముగనైనను సంపాదించి తీరవలయును. ఇదిలేనియెడల .పాతివ్రత్యము సంపూర్ణమైనది కాదు ... హిందూ సంఘమునందు సాంఘికధర్మస్థితి యీవిధముగా రూపమయియున్నది...వివాహప్రయోజనము కేవలము కామసుఖమునకును సంతానమునకును మాత్రమే కాదు ..వివాహానంతరక్షణమునుండి హిందువునియొక్క పత్ని భర్తచేయు మతకృత్యము లన్నింటియందు ..పాల్గొనితీరవలయును...కపత్నీవ్రతకృత్యసామర్థ్యసంపాదనార్థము గృహకృత్యమును పేక్షించియు వాని... తెలియకయు దురదృష్టవంతులగు భర్తృపుత్రాదులను వారి ప్రారబ్ధమునకు వదలి సంఘోద్ధరణార్థమై దేశాటనముచేయు...యువతికంటె గృహకృత్యములను శ్రద్ధాపూర్వకముగ నిర్వహించుకొనుచు.. భర్తకు...తోడ్పడుచు సహధర్మచారిణియగు స్త్రీయే...సంఘమునందు శ్రేష్ఠ...వివాహితయగు బాలిక చిన్నతనమునుండియే భర్తతో నుండవలసిన విధి...ఆదంపతుల యోగక్షేమములను మాత్రమే గాక [illegible] యొక్కను [illegible] క్షేమమును [illegible] యున్నది.

హిందూసంఘమునకు సంబంధించిన ప్రధానపురుషులు...అతిప్రాచీనసాంప్రదాయకులు నగువారు సంఘసంస్కరణ మనెడి మార్పు...అంగీకరింపరు... ఏవిధమైనసంస్కరణమునందు...వారికి నమ్మకములేదు. ...బ్రాహ్మణాదిజాతులును బ్రహ్మచర్యాద్యాశ్రమములును గర్భాధానాది సంస్కారములును...హిందువులయొక్క సాంఘిక

రూపమగుచున్నది. ఇదియే సంఘముయొక్క శరీరము. దీనియొక్క మార్పు సంఘముయొక్క నాశము ... ఈసంఘమునకు ... విరోధులలో నొకరగు బౌద్ధులు ... జోక్యముకలిగించుకొన్నప్పుడు వారు సంఘమునే విడిచిపోవలసివచ్చెను. సంఘమునందుండు ... జైనులు ... శాశ్వతసంఘరూపమగు వర్ణధర్మముల ... అవలంబించవలసివచ్చెను. సంఘములో ... ఎవరు ... సంఘశాశ్వతరూపమును ... అనుష్ఠించుచున్నారో వారు హిందూసంఘమున...చేరినవారలు... ఇతరమతముల ... అభిప్రాయములకు ... చూపెడుగౌరవమునకు ... చిహ్నమనునటు ... ఇతరసంఘీయుల నెవ్వరిని వీరు తమసాంఘికనియమములలో ... చేర్చుకొనుటలేదు. ... పూర్వకాలమునందు విద్యావిహీనులును స్థితిగతులు లేనివారును... సంఘముయొక్క కట్టుబాట్ల నతిక్రమించుచుండిరి. సంఘమన్నో సంఘమర్యాద నతిక్రమించిన వీరిసంబంధముచేత సంఘము చెడిపోకుండ నుండుటకు ... పశ్చాత్తప్తులయిన యీసంఘపతితుల... తిరిగి...చక్కచేయుటకును...సాధ్యముకానియెడల వారిని సంఘమునుండి బహిష్కరించుటకును సమర్థమయియుండెను. ... ప్రస్తుతపరిస్థితులయందు... సంఘమునందుండు జనసామాన్యము తమతమ మతధర్మములయొక్క విలువ నెఱింగినవారుగ నున్నను సాధారణముగ రాజకీయభావ మెఱుంగనివారైయున్నారు ... తగినపలుకుబడి లేకపోవుటచేత సంఘపతితులను...బహిష్కరించుటకును విలువలేనంత మర్త్యులులయియున్నారు... సంఘసంస్కర్తృ నామధారులు... పలుకుబడిసంపదలచేత...అభీష్టకార్యనిర్వాహణమునకు... సాధనభూతములగు... ప్రకటనలచేత ... కదలించుటకు విలువలేనంత దృఢముగ హిందూధర్మములు వారియందు శ్రద్ధాభక్తులుగల హిందువులయందు రూఢములయి వారి నిత్యజీవితమునందు ...పాదుకొనియున్నవి.

ఇందుచేతనే ... తమయభిమతములను బలాత్కారముగ హిందూసంఘమున ... చొప్పించుటకు ... ప్రయత్నించుచున్నారు. మతముచేత నన్యులయిన ... అక్బరుమున్నగు చక్రవర్తులును ... ఆకాలమునందు హిందూదేశమునందుండు నానాజాతి సంఘములయందు ... మార్పు ... చేయుటకు ... ఇచ్ఛగలవారైనను...రాజకీయశాసనములచేత మతసంస్కారముల మార్చుటకు ... యత్నింపలేదు ... ఔరంగజేబంతటి చక్రవర్తికూడ ... నాతనివిస్తృతప్రభుత్వశాసనములచేత ... ప్రభుత్వాధికార

మును దురుపయోగము చేయలేదు. ఆ కాలమున ... ప్రభుత్వాధికారులు తమ సాంఘిక విషయములయందు ... జోక్యము కలిగించుకొన్న యెడల సంఘము దృఢముగానుండి దానిని నిగ్రహించుటకు సమర్థమైయుండెను. ... మతసాంఘిక విషయములు చర్చించుటకు ... అర్హత లేకుండియు ... ఏదో విధముగ మార్చుటయందే మోహముగల శాసనసభాసభ్యులు తమకు రాజ్యపరిపాలనౌదార్యముగాని రాజ్యపరిపాలన నీతిగాని లేదను విషయమును లోకమునకు వెల్లడిచేయుచు .. తమ సాంఘిక విషయములయందు జోక్యము గలిగించుకొనుచున్నారు. హిందూసంఘముయొక్క రూపమును జీవమును ... చక్కగనున్న ... గ్రామ సముదాయమున ...ప్రభుత్వమువారు తమ మతసహనముచేత ... సంపాదించినకీర్తిని నిలుపుకొనుటకు ... సంపూర్ణముగ విచారించుట కర్తవ్యమయియున్నది ... సంఘసంస్కర్తృనామధారులు ... వేదశాస్త్రములను ఋషిప్రోక్తములగు వాని సమన్వయములను ... విశ్వసించు మాపై ...తమ నూతన మతవిశ్వాసములను శాసనపూర్వకముగ...చొప్పింప...యత్నించుటను...ఆక్షేపించుచున్నాము. వారు హృదయపూర్వకముగ మాకు సౌఖ్యమును...చేయుచున్నామని తలంచినను వార లవలంబించుచున్న సంస్కరణ...లవలన...లాభముగాని సౌఖ్యముగాని కలుగ...దని విమర్శపూర్వకమైన తలంపుతో దాని నభినందింపని మాయందు వారిప్రయత్నము నిష్ఫలమగుచున్నది. ...ఒకనికి ...ఇష్టముకానిదానిని వానికి సంతుష్టికూర్చి...తృప్తిపఱచుట... సాధ్యముకాదు.

...ఈ వింతవింతమార్పులుచెందుచుండు సంస్కర్తృనామధారులు... వేషభాషలందు మారురూపములనున్నారు. హిందూవేషము... సంస్కర్తృనామధారులు తాము హిందువులు గా వ్యవహరించుటకు... అవకాశమిచ్చుచున్నది... మాసంప్రదాయానుసారము ప్రభుత్వపదవియందున్నవారు భగవద్గుణములు కలిగియుండవలయునని యుండుటచే... ప్రభుత్వపదవియందున్నవారి ధర్మమునకును దయకును మేము విజ్ఞప్తి చేయుచున్నారము.

...మేము అనేకశతాబ్దములనుండి ప్రభుత్వాదరణము లేనివారముగా నున్నారము. ఈకాలవ్యవధిలోనే ప్రస్తుతమున్న గొప్పసంఘము లన్నియు... అపారమైన ప్రభుత్వాదరణముచేత వృద్ధిపొందియున్నవి...మతాంతరులచే... దురవస్థలను... మే మనుభవించవలసివచ్చినది... ఈచిక్కులతోపాటు... విపరీతమయిన...జ్ఞానముగల...సం

ఘుసంస్కర్తృనామధారుల... దాడి...కూడ సంభవించినది...

ఇట్లు బుధజనవిధేయులు,

౧ అరుణాచలశాస్త్రి-కక్కలాని- తంజావూరుజిల్లా.

౨ చదలవాడ సుందరరామశాస్త్రులు- మదరాసు....

౩ వేదము వెంకటరాయశాస్త్రి-... కావలి.

౪ పిన్నమరాజు వెంకటసుబ్రహ్మణ్యశర్మ...ఎడిటరు-వర్ణాశ్రమధర్మసంస్థాపనము.

౫ మల్లాది రామకృష్ణచయనులు- బెజవాడ. ..

౬ పర్ణశాల నరసింహాచార్యులు- మదరాసు.

౭ యస్. వి. రంగాచార్యులు-... ఎడిటరు-బ్రాహ్మణపత్రిక

౮ జనమంచి శేషాద్రిశర్మ- కడప...

౯ శ్వేతారణ్యం నారాయణయజ్వ-శ్వేతారణ్యం- తంజావూరుజిల్లా...

౧౦ కాశీ కృష్ణాచార్యులు- గుంటూరు.

౧౧ గొల్లపూడి లక్ష్మణశాస్త్రిసోమయాజులు- బ్రాహ్మణనిడమానూరు...

౧౨ వి. స్వామినాథయ్యరు.-మహామహోపాధ్యాయులు...

౧౩ యమ్. రామానుజాచార్యులు- కుంభకోణంకాలేజిఅరవపండితులు...

౧౪ ఐ. వై. అనంతరామయ్యరు... ద్రవిడపండితులు- ప్రెసిడెన్సీకాలేజి.

౧౫ పంచాగ్నుల దక్షిణామూర్తిశాస్త్రి...

౧౬ జగర్లపూడి వెంకటసుబ్బయ్యశాస్త్రి- చీమకుర్తి...

౧౭ శ్రీ. వై. కోటీశ్వరశాస్త్రి... సెక్రటరి, సరయూగిమహాజనసభ.

౧౮ మైదవోలు లక్ష్మీనరసింహసోమయాజులు- శ్రీకాళహస్తి...

౧౯ పిర్రాల రామచంద్రాచార్యులు-శ్రీకాళహస్తి-విద్యావాచస్పతి...

౨౦ తవ్వా ఉదయవరులు-మదరాసు-గౌర్నమెంటుకంట్రాక్టరు...

౨౧ యస్. బాలసుందరమొదలియారు. బి. ఏ. బి.యల్ ...హైకోర్టువకీలు-మదరాసు.

౨౨ భాష్యంనాయుడు-సెంటుతామ్సుమౌంటు- చెంగల్పట్టుజిల్లా

౨౩ యన్. వీరభద్రశర్మ-వీరరాఘవపురం-తిన్నెవల్లిజిల్లా.

౨౪ కనుపర్తి మార్కండేయశర్మ... ఎడిటరు-స్వధర్మప్రకాశిని.

౨౫ శ్రీ పోల్పూరు వెంకటసుబ్బనామాత్యుడు-యమ్. బి... ఎడిటరు- వేదిక్‌వర్ల్డు.

( స్వధర్మప్రకాశిని )

జానపాటి పట్టాభిరామశాస్త్రి

ఎడిటరు అభినవసరస్వతి



# అష్టావధానము.

ఒంగోలు తాలూకా కరవదియను గ్రామంబున జమ్మవరం యస్టేటు ప్రొప్రైటరుగారగు బ్ర॥ పిశుపాటి వెంకటరాయశర్మగారు బంధుప్రియ శ్రేణితోను పండితబృందంబులతోను శేషాచలమునకేగి శ్రీశ్రీనివాససన్నిధానమగు నలవేల్మంగాపురంబున పుత్రునియొక్కయు పుత్రికయొక్కయు వివాహోపనయన మహోత్సవములను మాఘశు ౧౫ గురువారమునాడు పంచాహ్నికదీక్షతో సలిపి పండితవర్యులకు సువర్ణనాణెములనిచ్చి అతిథుల కన్నదానం బొసంగి గజాశ్వారోహణాది గ్రామోత్సవంబుల గావించి బంధుమిత్రపరివార సహితంబుగా స్వగ్రామంబు చేరినపిమ్మట ఒంగోలు తాలూకాబోర్డు ప్రసిడెంటుగారగు మ॥ రా॥ రా॥ శ్రీ రాముల రాధాకృష్ణయ్య బి. ఏ., బి. యల్. గారి యగ్రాసనాధిపత్యమున సికింద్రాబాదానివాసులగు బ్ర॥ చివుకుల వెంకటాచలశాస్త్రిగారిచే స్వగృహంబునం దష్టావధానముఁజేయింప శ్రీశాస్త్రిగారు తమధారణాశక్తిచే సభ్యులకానందము గలిగించిరి. సభ్యులవధానిగారిని బ్రశంసించగా నవధానిగారికి శ్రీశర్మగారిచే సువర్ణపతక మివ్వబడెను. ఆగ్రాసనాధిపతిగా రంత్యోపన్యాసమందు తండ్రిగారిచే స్థాపింపబడిన పాఠశాలలయందుండు నుపాధ్యాయులకు వేతనములనిచ్చి పోషించుచు గీర్వాణభాషావిద్యార్థులకు ధర్మాగారమున నన్నము పెట్టించుచు దేవాగారములయొక్క గోపురప్రాకారమంటపాదుల నిర్మాణమును కడుశ్రద్ధతోఁ జేయించుచుండిన శ్రీశర్మగారికి శ్రీశ్రీనివాసమూర్తి వేదోక్తశతాయుష్యప్రాప్తిరూపమంగళము నిచ్చుగావుతమని శ్రీశ్రీనివాసమూర్తిని ప్రార్థించుచు సభ ముగించిరి.

ఒంగోలు,
12-2-25.

పంచాగ్నుల సేతుమాధవశాస్త్రి,
పి. వి. ఆర్. హిందూపాఠశాల.

# దేవీభాగవతవిచారము.

దేవీభాగవతప్రాశస్త్యమను వ్యాసమును పరిశీలించిన ప్రాజ్ఞులారా! కించిద్జ్ఞశబ్దమాత్రుడనగు నేను కేవల దేవీభాగవతప్రాశస్త్యమేకాక త్రిమతస్థులకున్ను పురుషార్థచతుష్టయ మొసంగుచు పూర్వాచారానీతమగు శ్రీభాగవతమును దేవీభాగవతమునకు పూర్వపదముగ దేవీశబ్దపక్షపాతులగుటచేతనో యీశ్రీభాగవతమును విష్ణుశబ్దపూర్వముగా వ్రాసి తద్ద్వేషముచేతనో యీశ్రీభాగవతమే అప్రాశస్త్యమని వెల్లడించు వేములపల్లి క్రిష్ణారెడ్డిగారి వ్యాసముచూచి సంశయముచే పత్రికాధిపతులగు జానపాటి పట్టాభిరామశాస్త్రిగారికి సర్వవిదులగు మీరు తమపత్రికయందు యీదేవీభాగవత ప్రాశస్త్యమును ప్రశస్త్యముగాకున్న యేరీతివెల్లడింతురనే అభిప్రాయముచేత లోపున సముద్రముండ దాహముచే బాధనొందువానివలె యితరుల ప్రశ్నించనేలనని శాస్త్రిగారికి మనవిచేసి యున్న సంగతియును దానికి శాస్త్రిగారు వెల్లడించిన ప్రత్యుత్తరాభిప్రాయమున్ను యీపుష్యమాసపత్రికలో మీఅందరకు విశదమే.

మనవి చిత్తగింపుడు.

యిట్టిసందర్భముచేతయు శాస్త్రిగారి ప్రత్యుత్తరాభిప్రాయముచేతయున్ను యీ రెండుభాగవతముల యొక్క అపోజనపాజలను యింతవరకు శ్రీభాగవతమునే బహువిధములుగా వుపయోగపరచుచు త్రిమతములయందు ప్రాజ్ఞతములగు మీయందరి అభిప్రాయమును నిష్పక్షపాతబుద్ధిచే వెల్లడించి లోకహిత మాచరింపవలెనని నావిజ్ఞాపన.

నాయథామతిగా రేపటిమాసపత్రికలో నానిశ్చయమును ఆచార్యానుగ్రహముచే తెల్లడించగలను.

ఇట్లు,
లక్ష్మారెడ్డి, క్షీరసాగరం.

★

## —* పంచపిండాగౌర్యుత్పత్తి *—

తే॥ "యాజ్ఞవల్క్యసుతుండని యస్యకథను సూయటంచని యురకుంటి సూత! మరల
నెవ్వ రాతనిమాత? యెట్టిట్టిఁడతఁడు? నిఖిలమును మాకు వినిపింపు నీవె దయను"
వ॥ నావుడు సూతుండు ౪౭౮

తే॥ "అతని కిరువురు పెండ్లాలు, పతికి హితలు, జ్యేష్ఠ మైత్రేయి, గుణవతి, చిన్న దియును
నిత్యకల్యాణి కాత్యాయనీసమాఖ్య, యాపెకొమరుండె చుండి కాత్యాయనుండు
వ॥ వారి కిరువురకును సుస్నాతుల శుభలోకంబులొందం బంపెడి రెండు కుండంబులుండెడిని, గాత్యాయనీతీర్థసమీపంబున శాండిలీతీర్థంబని మఱియొకండును విరాజిల్లు, సపత్నీదుఃఖదుఃఖితయగు కాత్యాయని శాండిలిచేఁ బ్రతిబోధితయై శుద్ధవైరాగ్యమానసది తత్తీర్థంబునన, యందు మార్గశిరశుద్ధతృతీయ సుస్నాతయైననాఁటి సౌభాగ్యసమేతయయ్యెడి, ౪౭౯

సీ॥ తిన బుక్కయును గట్టుకొన బట్టయును లేక వందురు దౌర్భాగ్యవంతురాలు
నది యాపదార్థమం చెఱిఁగి యిచ్చఁ జరింప ననువుగాకతపించు నంధురాలు
నింద్రియపాటవం బిసుమంతయును లేక విషయలోలతఁగుందు వృద్ధురాలుఁ
దన వికారపురూపు గని జను ల్నగుచుంటఁ గూర్చి లోఁ బలవించు కుబ్జురాలు
గూడఁ దత్తీర్థసత్త నందా డుమాత్ర స్వస్వవైకల్యములు వటాపంచలగుదు (బుషులు
భాగ్యభోగ్యంబులం బొంది పరమసుఖముఁ బడయుదు"రటంచుఁ జెప్పుదు బ్రహ్మ

ఆ॥ "ఎట్టిసవతిపోరుపుట్టె కాత్యాయని? కెట్టిసదుపదేశ మీయఁబడియె,
శాండిలీ తదుభయ సమ్మేళనమునుండి యొకటి శేష ముండకుండ దరయ"
వ॥ అనియడుగుటయు సూతుండిట్లనియె, ౪౮౦

కం॥ "మైత్రేయి యాజ్ఞవల్క్యుని గాత్రము స్పృశియించుటకును గాత్యాయని యే
మాత్ర మురరీకరింపక రాత్రిందివ మీర్ష్యనూని రంజిల కాత్మన్ ౪౮౧
వ॥ స్నానపానాదికంబు లన్నియు మానుకొని నిట్టూర్పులునిగుడఁ గంటికిఁ గడవెడుగాఁ వలపోయుచు నొకనాఁడు ఫలంబులకై పొలంబునకుఁబోయి వినయావనతయై దోసిలిపట్టుకొని పెనిమిటిపార్శ్వంబున నిలుచుండియుండు శాండిలియను సతీతిలకంబును గుణదోషసంబంధములగు మాట లడుగుచుం జెప్పుచుఁ బ్రసన్నంబులగు వీక్షణంబుల సానురాగంబుగాఁ దన్ముఖంబును వీక్షించు నాపె ప్రాణనాథుని దర్శించి

సీ॥ చెప్పవాల్పక యెల్లయప్పుడుఁ బతిచేత నవతె ముఖాంబుజం బీక్ష్యమాణ
మైద్దానితో నాథుఁ డేప్రొద్దు లీలమై మంచిచెడ్డలఁగూర్చి మాటలాడుఁ

ప్రేమము స్నేహముం బెనఁగొనఁ బట్టుగా వర్తించు నెద్దానిభర్త సతము
నెవ్వర్తనెనిమిటి యేకపత్నీవ్రత నియమంబుకదలకే నిలిచియుండుఁ
దద్వధూమణి శాండిలి ధన్యరాలు గుణించుఁ జింతించి పలుమాఱు లాత్మలోనఁ
దన్నుఁదాఁ దిట్టుకొనుచు స్వధామమునకుఁ బోయెఁ గానొకనాఁడు తచ్చపలనయన

వ॥ ఒకానొక కార్యమువిూఁద శాండిలి నగరము వెలుపలికిఁబోయియుండ నేకాంతంబునఁ గలసి ౪౫౪

చం॥ "పతులు సతంబు స్వీయముఖపంకజ వీక్షణసేయుచుంటకున్
వితగ దురుక్తులంబలికి బిట్టవమానము సేయకుంటకున్
మతినయినన్ మఱొక్క కులమానినిపొత్తు దలంపకుంటకున్
సతు లెదిచేయఁగావలెనొ శాండిలి! చెప్పఁగదమ్మ సత్కృపన్ ౪౫౫

తే॥ ఎట్లువశుఁడయ్యెఁ బతి నీకు హితకరాస్య!? యెట్లునీకోరుకోర్కులనెల్లఁ దీర్చె?
నెడఁదలోనైన మఱియొక్కయింతిమాట తలఁపకుంటకు నీ వేమిసలిపియుంటి?

వ॥ అని యడిగిన శాండిలియిట్లనియె, ౪౫౬

ఆ॥ "నాకునుంగుభర్త నాకు వశుండయి కోరుకోర్కులెల్లఁ గొనలుసాగఁ
జేయుటకును నాదు స్మితముఖంబ ప్రొద్దుఁ గాంచుచుండుటకును గతము విన్మ

కం॥ నాజనకుఁడు శాండిల్యుఁడు తా జాయాసహితుండగుచుఁ దపమొనరింపం
గాఁ జనియెఁ గురుక్షేత్రము ప్రాజత్ప్రాయంబునందు పంకజముఖిరో! ౪౫౯

ఉ॥ అమ్మునికిం దపోవనమునందున నేను జనించి నిండుప్రే
మమ్మునఁ బెంపఁగాఁబడి క్రమమ్మునఁ దత్పరిచర్య సేయుచున్
ద్రిమ్మరి నొక్కచో నటకు దేవమునీంద్రుఁడు శాంతుఁడొచు వే
గమ్మగ నేగుదెంచుటయుఁ గాళ్లకు నీళ్ళిడి తత్క్షణంబునన్ ౪౬౦

ఆ॥ స్నానమునకుఁగూడ జలములం దోడుచుఁ దజ్జలముల నతఁడు తానమాడి
కుడిచికూరుచుండి కొంత సేపటికి మాయమ్మచేత నిట్లు లడుగఁబడియె, ౪౬౧

ఆ॥ "మాకు లేకలేక యీకన్నె యొక్కర్తె పుట్టినది మునీంద్ర! కట్టకడకుఁ,
గాన మామకీన ప్రాణంబులన్నియు నాకెపైనె యుండు, నట్లుగాన ౪౬౨

సీ॥ ఆత్మకష్టములైన యఖిలసద్గుణములన్ గడు సౌమ్యుఁడై యుండఁగలుగువాఁడుఁ
గరము చిరాపత్తుఁ దిరిగెడియెడ నేని విప్రియంబులువల్క వెఱచువాఁడు
నరనిమేషము భార్యయాననంబును జూడకుండనుండఁగలేని హాయిలువాఁడు
వలచి తాఁ దైఁబడవచ్చినప్పుడుకూడఁ బరనారిరతి కిష్టపడనివాఁడు

భర్తయగుటకుఁగా సుఖోపాయమైన హోమమో నేమమో నోమొ యొకటిచెప్పు"
మనుడు నారదముని చిరం బాత్మలోన బిట్టు యోజించి యోజించి యిట్టులనియె,

ఆ॥ "హాటకేశ్వరమున నా పరమేశ్వరియైనగౌరి గౌరి యధికభక్తిఁ
బంచపిండఁగాఁగ బాగుగా స్థాపించి కొలిచె గంగమీఁదఁగలుగు నీర్ష్య,

ఆ॥ తొల్లి సపత్నిమీఁదఁ గడుదొడ్డయసూయవహించి గౌరితాఁ
"దల్లి బోలె నెల్లపుడుఁ దద్దయుఁబత్తిని నన్నుఁ గొల్చి యా
యెల్లసురాంగనల్ తమ యభీష్టము పొందుచునుండ నేను నా
వల్లభు నెవ్వరింగొలిచి వశ్యముచేసికొనం గడంగుదున్, ౪౯౫

తే॥ కాన నను నేనె పూజింతుఁ గరముభక్తి"ననుచు యోజించి యోజించి మనమునందు
శివునివిడనాడి కార్యసంసిద్ధిదమని హాటకేశ్వరమునకు వేయరిగి యచట ౪౯౬

ఆ॥ భక్తితోడ నొకటఁ బ్రాణాగ్నిహోత్రమంత్రముల నట్టిముద్ద లమరిపించి
యందుఁ బృథివిఁదొట్టి యయిదుభూతములఁ బ్రతిష్ఠితముల జేసి నిష్ఠతోడ ౪౯౭

తే॥ వానికిం బూజసేయుచు వర్తిలుటయు న య్యథర్వణమంత్రంబు లపుడు శివుని
హృదయమును గుంజివైచె, నయ్యుడుమహాళి యొగుదెంచి మృడానితో నిట్టులనియె,

చం॥ "అనిమిషంబు నీదు రుచిరాస్యము గన్గొనకుండ నుండలే
ని రమణు వీడి యిప్పటికి నీ వరుదేరఁ గతంబదేమి? నే
జరిపినదోసమున్న మది సంశయమందక చెప్పు, లేదొ నేఁ
దొరగ వృషాధిరూఢవగు, తోడ్కొనిపోయెద వెండికొండకున్" ౪౯౯

తే॥ అనుటయును దేవియిట్లను "సజ్జనాభ! కాళ్లక్రిందనుబడియుండు గంగఁదెచ్చి
నెత్తి నెక్కించుకొంటివి నీవు దేవ! యింతకెక్కువదోస మింకేమియుండు? ౫౦౦

క॥ కాన మహాదేవా! విను, మా నా సవతిని ద్యజించునంతఁదాఁక భవ
త్స్థానమున కింతమాత్రము నే నరుదేర, నిది నాదు నిశ్చయ మరయన్, ౫౦౧

ఆ॥ నాదుకనులయెదుర నాథ! నిర్లజ్జత సంధ్యకును జోహారు సల్పుచుందు,
విట్టిపట్టు నే నీకెట్టుల నీతోడఁ గాఁపురంబుచేయఁగలనొ చెప్పుము" ౫౦౨

ఉ॥ నావుడు దేవుఁడిట్టులను, "నాతిరో! జ్ఞాతులనుద్ధరించు స
ద్భావనమై భగీరథుఁడు పాదములంబడ నుచ్ఛిరంబునం
దీవిడఁ జేర్చుకోవలసె, నింతియకాని సుఖంబుపొందఁగా,
దీవిటులేల యీర్ష్యవహియింతు వృథాగఁ, బరిశాంతకమ్మఁకన్, ౫౦౩

తే॥ దివ్యవర్షసహస్రము ల్దేవి! యతఁడు ఘోరతపమొంది వరమును గోరుకొనుడు
గంగ దివినుండి పాతాళగతము గాకయుండ మన్మూర్ధమందున నుంచవలసె, ౫౦౪
ఆ॥ మింటినుండి ప్రుడమిమీఁదికి దుముకుచో దానివేగమాఁగ వేనివశము?
జగతి పగులుచుకొని చనుచుండెఁ బాతాళ మేనె తలనుదాల్పఁ బూనకున్న, ౫౦౫
తే॥ నాదుమూర్ధంబునుండి యానాకతటిని శితనగముచు బ్రిద్దలుచేసికొనుచు
రెండుచీలికలై యం దొకండు సింధువనఁగఁ దొమ్మిదినూఱుల యాపగలను ౫౦౬
కం॥ కొనిచని పడమటిసంద్రంబునఁ గలయును, వేఱొకండు భువి గంగయనం
గను మఱితొమ్మిదినూఱుల ధునులంగొని పోయి ప్రాచ్యతోయధిఁ జేరున్ ౫౦౭
కం॥ కాన దివానిశములు బడబానలమున శోష్యమాణుఁడగుచుండియుఁ దా
న్యూనత్వమువహియింపక యానీరధి యుండఁగలిగె నంబుజవదనా! ౫౦౮
సీ॥ తత్సముద్రజలంబు ద్రావి పయోదముల్ వర్షంబుగురియును నివ్వసుధమీఁద
వర్షంబు గురియుటవలన సస్యంబులు జనియించి పెంపొంది పక్వంబుఁ
బండిన ధాన్యాదిభక్ష్యపదార్థముల్ భక్షించి భూప్రజ బ్రదుకఁగలుగుఁ
బ్రజ యనామయమౌచుఁ బ్రదుకఁగల్గినమీఁదఁ గావింపఁబడును సత్క్రతువులిలను
క్రతువులొనరించుచుండినఁ గ్రతుభుజులకుఁ దృప్తియగుచుండుఁ గావున దేవి! నేను
గంగఁ దలఁదాల్చుచుంటిని, గామవశతఁగాని స్నేహాతిశయమునఁగాని కాదు, ౫౦౯
చం॥ నినుగుఱియించి నాకతటినిం దలనుండి తొలంగఁద్రోయుచోఁ
జనును ధరం బగుల్చుకొని చయ్యన నయ్యది నాగలోక, మా
వెనుక నదీశుఁ డౌర్వమున వేగముగం బరిపీయమానుఁడౌ
నొనరదు సృష్టి యంత, జగ మెయ్యెన నాశమునొందు నందునన్, ౫౧౦
కం॥ గంగను నెత్తినిబెట్టుకొనం గల కారణము చెప్పినాఁడను, సంధ్యన్
వంగి నమస్కృతిసేసెడిసంగతి వచియింతు నీకు శ్రవణింపు సతీ! ౫౧౧

—* ఈశానోత్పత్తి *—

ఉ॥ రాత్రి పిశాచభూతములు రక్కసులుం జరియించుపొంకై భీ
దాత్రిగ నేరుపడ్డయది, తత్సమయంబున ధర్మకర్మ మే
మాత్రముచేయఁగాఁబడిన మానక తత్ఫలముల్ భుజింపఁగన్
బాత్రులు వారె, యిద్విధము బ్రహ్మ విధించినవాఁడు భామినీ! ౫౧౨
తే॥ సురలు నసురులుఁ గశ్యపు సుతులె యగుట నందఱికిఁగూడ నున్నది యజ్ఞభాగ,
మందు జ్యేష్ఠులు నిశ పవ లమరవరులు స్వీకరింపంగ మర్యాద చేసికొనిరి, ౫౧౩

చ॥ ఇనుఁ డుదయించుమీఁదఁ దప రెండులకుం గొఱగామువౌట నా
యినుఁ డుదయింపకుండనె రహింపఁబడి వేవురు పూర్వదేవతల్
చని యఱకట్టుచుండుదురు, సంగరదుర్జయు లెన్న వార, లా
ఘనుల జయింపలేక బలు కార్శ్యమునొందెడి నుష్ణరశ్మియున్, ౫౧౪

కం॥ సావిత్రంబగుమంత్రముచే వారి సుమంత్రితంబుఁ జేయుచు వదలన్
దేవారుల మూర్ఛితులం గావించుచు నొండుదీవికడఁ బడవైచున్, ౫౧౫

కం॥ తెప్పరిలి మరలవచ్చెద రప్పుడు నప్పుడును వార, లందులకనిరే
ముప్పూటు సంధ్యవార్చుట తప్పనిపనియయ్యె నాకుఁ ద ద్ద్విజతతికిన్ ౫౧౬

తే॥ సంధ్యలను మూటియందును సవితఁగూర్చి కాంచి వందన మొనరించు టేను బూని
సంధ్యఁగూరిచి కాదహో సరసిజాక్షి! యేల యీగ్లానివహియించె దీవు పృథగ,

తే॥ లోకసంగ్రహమున కిటు లోపకతప్ప దాప్తకాముండనైకూడ నార్య! నేను,
శ్రేష్ఠుఁ డెయ్యదియొనరించు క్షితితలమున నుత్తరత్రజనంబదే యొనరించెడిని, ౫౧౭

కం॥ కావునఁ బోవుద మింటికి గ్రావాధీశాత్మజాత! గ్రక్కున లెమ్మా,
నీవంటి యుత్తమోత్తమఁ బోవిడిచి మదాత్మ యెటుకుఁబోయెడిఁ దలఁపన్

కం॥ అనవుడు నిష్కాముఁడవైనను లేక సకాముఁడవయినను స్త్రీసంజ్ఞన్
మనుసంధ్యకు నీవీగతిఁ బ్రణమిల్లుటఁ జూచి దుఃఖపడ కెటులుందున్ ?

ఆ॥ కాన నీవు సంధ్య గంగను నెందాఁక వదలకుందో యంతవఱకు నాకు
సత్యముగను సంతసం బుదయింపదటంచుఁ బ్రార్థయానుఁడైన మగని ౫౨౧

కం॥ అవమానించి మహావ్రత మవలంబించుదు మహేశుఁ డక్కట! యీశాం
భవి ప్రతిమాలంబడియును శవళయగుట కేమిహేతువైయుండెడినో"

మ॥ అనిచింతించుచు యోగదృష్టిఁగని మంతౌత్రిక్ప్రష్టుఁ డౌటన్ మనం
బున భావించి కరంబుమంచిదని యామూర్తంబునందే యతం
డును దన్మంత్రము న్యాసయుక్తమగునట్లుల్చేసి యత్యంతని
ష్ఠను గూర్చుండి జపించె లెస్సఁ దనుదా సద్భక్తిఁ బూజించుచున్, ౫౨౩

కం॥ పార్వతి పూర్వంబునఁ దా వేర్వేఱుగ నిలిపి పూజవిధియించిన యా
యుర్వీముఖాత్మభూతాల్ సర్వాంతర్యామియయ్యు శర్వుఁడుగూడన్ ౫౨౪

ఆ॥ వేఱువేఱుగాను వెలుపలఁ దా నియోజించి నిష్ఠఁ బూజచేసె వాని
యుండఁ దతనికంటె నొరుఁ డీజగంబునఁ, బూజ్యపూజ్యుఁ డతఁడె పూవుఁబోఁడి!

శా॥ ఈశిత్వంబున సర్వదేవతలకున్ హెచ్చైనవాఁడయ్యు వే
తీశానున్ విరచించి భక్తిమెయి నాయీశానుఁ దర్చింపఁగా
వాశర్వాణి తదర్చ్యమాణ మనుదేవాకృష్టయై వచ్చి యా
యీశుం గూర్చి నమస్కరించి కయిదోయిన్ మోడ్చి వే యిట్లనున్, ౨౨౬

చం॥ తెలియఁగనయ్యె నంతయును దేవ! భవత్ప్రియ నన్ ద్యజింప, కేఁ
జలమున నీవుచెప్పినటు సల్పక యీక్ష్యవహించియుండినం
దులకు క్షమించి వేగననుఁ దోడ్కొనిపొమ్ము, భవత్సమీక్షిత
స్థలమున కేగుదెంచుటకుఁ జాలఁ గుతూహల మందుచుండితిన్, ౨౨౭

కం॥ అనియిటు వాక్రుచ్చుటయును ఘనతరమోదంబునొంది గంగాధరుఁ డా
వనబోఁడిఁ గౌఁగిటం గ్రుచ్చినవాఁడై నవ్వుకొనుచు స్నేహము మీఱన్ ౨౨౮

—* పంచపిండాగౌరీమాహాత్మ్యము *—

కం॥ నీ వాత్మభూతములచేఁ గావించిన విగ్రహమును గడుభక్తిమెయిన్
సేవల మార్గతృతీయనొ యావత్సంవత్సరంబొ యర్చించు సతుల్ ౨౨౯

కం॥ కొడుకుల బిడ్డలఁ గోర్కుల నిడియొడి కడు మంచిమగల నెనసి సుఖముగన్
బుడమిని మనుచుండెద రోమదవతీ! తత్పంచపిండ మాహాత్మ్యమునన్ ౨౩౦

ఆ॥ అట్లు మామకీనమైన యీశానాఖ్యమూర్తిఁ గొలుచునరుల ముద్దరాంగ్రము
చెడిపెట్టెనఁగాని కడుమంచివారుగా మాఱుదురు తదీయమహిమవలన, ౨౩౧

తే॥ కన్నియలఁగోరి యిమ్మూర్తిఁ గడుభజించుపురుషు లాకన్నెమిన్నలం బొందఁగలరు
కోర్కె యొకటియునులేకయే కొలుచువారు జరయు మృతి లేని పదమున కరుగఁగలరు

ఆ॥ అని వచించిశంభుఁ డంబాయుతంబుగా వృషభమెక్కియరిగె వెండికొండ,
కందువలన యుష్మదాత్మజ తత్పంచపిండమయను గౌరి నిండుభక్తి ౨౩౩

ఆ॥ ఒక్కయేఁడు నందు మిక్కిలిగం దృతీయను భజింపఁజేయు మనఘచరిత!
రూపముఖ్య సుగుణరూఢుఁ ముఖపేర్తిము మిగులఁ బ్రీతు మంచిమగనిఁ బడయు”

కం॥ అనియిట్లుచెప్పి నారదమునివరుఁ డేగుటయు నతని మదలను నే నో
వనజానన! కౌమార్యంబుననుండియు మంచిమగనిఁ బొందెడివేడ్కన్ ౨౩౫

తే॥ మార్గశిరమాసమాది మణిమాసయుగళి నటు విశేషించి తదియయుం దమ్మహేశ
గంధమాల్యానులేపముఖ్యములతోడ వివిధవిధములఁ బూజగావించుటయును ౨౩౬

తే॥ పంచపిండ యనునప్రిభావమునను నీవుపొందఁగాంచియుండిన నిరుపమాన
గుణుఁడు జైమిని పేరిబ్రాహ్మణుండు నాకుఁబ్రాణనాయకుఁడయ్యె నన్యములనేమి?

శా॥ కావున్ నీవును బూజచేయుము సతీ లోకల్యాణి! మైత్రేయికిన్
దేవం గూడను దీసికొనవు, మఱిం జేకూరు సౌభాగ్య, మ
జ్ఞానాధీనతచే యథోక్తవిధి నీకామార్యయుం దీవు త
ద్దీనత్రిత్రి భజింపకుండుట సపత్నీదుఃఖమి స్తేన్వడేన్" ౫౩౮

వ॥ అనినవిని కాత్యాయని శాండిలికిం బ్రణమిల్లి స్వగృహంబునకుం బోయి మార్గశీర్ష తృతీయాదివసంబున మొదలుపెట్టి యొక్కసంవత్సర మా పంచపిండాగౌరిం బూజించి తైలక్షారపరిత్యక్తంబులగు పృష్టాన్నంబుల దశవర్షవయస్కలగు కన్నియల భుజింపఁజేయుచును గుంకుమపూర్వకంబులగు గంధరసంబులం బూజించుచును నుండుటయు వత్సరాంతంబున యాజ్ఞవల్క్యుండు తదంతికంబున కేతెంచి ౫౩౯

తే॥ "కామదుండయి నీప్రియకాంతుఁడుండ నేమికష్టంబు చేసెదే యింతి! నీవు,
రమ్ము పోదము మన గృహాంగణమునకు, నేల వమ్మొనరించెదీ మేలిమొగలు" ౫౪౦

—• వరరుచి గణపతిం బ్రతిష్ఠించుట •—

వ॥ అని వాక్రుచ్చి దక్షిణకరంబునం బట్టి లేవనెత్తి పులకాంచితకళేబరంబున స్వసంతోషంబు వెలువరించు నాయమం దోడ్కొని హర్షించుచు నాత్మాగారంబునకుం జని మైత్రేయితోడం బోలెఁ బ్రవర్తిల్లుచు గుణాన్వితుండును యజ్ఞకర్మవిచక్షణుండును గాత్యాయనాభిధానుండును నగు కొమరునిం గనియె, గుణసాగరుండును వేదవేదాంగపారగుండును నగు వరరుచి యా కాత్యాయనునకుఁ బుత్రుండై విద్యార్థులకొఱకుఁగాఁ దచ్ఛుభక్షేత్రమందుఁ జతుర్థీ శుక్రవారంబున సర్వవిద్యాప్రదాయకుండగు మహాగణపతిం బ్రతిష్ఠించె, నెవ్వఁ డావినాయకుముందఱ శాంతిపాఠవిధానంబునఁ బుష్పమాలం గ్రహించి శక్తికొలఁదిఁ బఠించువాఁడు జన్మజన్మంబునను వేదాంతశాస్త్రజ్ఞుండగు, నెవ్వఁడు పఠింప నసమర్థుండై కేవల పుష్పమాలనే గ్రహించు వాఁడు సర్వదా యాజ్ఞికవిద్వద్గృహంబులం బ్రభవించును గాని నిందితులగు మూర్ఖుల సదనంబుల నెంతమాత్రము జన్మింపఁ"డని నుడువుటయు

శా॥ నావారల్ పెరవారలన్న భిద యేనాఁడున్ మదిన్ లేకయే
యావారల్ పొసరించుకృత్యములలో నావంతతప్పుండినన్
సేవాదూరులఁజేసి కట్టులుకమై శిక్షింపఁగంజూచు స
ద్భావా! యాదవరాష్ట్రవర్తిగణపూర్ణబ్రహ్మభూమీధవా! ౧౮౭

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురుగురుకరుణాకటాక్షసంప్రాప్తాధ్యయాభాషా పాండిత్య
రసవత్కవిత్వనిధాన హరితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా
గర్భశుక్తి ముక్తాయమాన విద్వత్సభాసమ్మతావధానవిధాన జానపాటి
పట్టాభిరామాభిధాన సమాంధ్రీకృతంబగు శ్రీస్కాందమహా
పురాణాంతర్గత నాగరఖండంబునందు

పంచమాశ్వాసము



# అభినవసరస్వతి

పత్రికాధిపతి:—— జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యేకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును [illegible] లును వ్యాసములును ప్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

## ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | అప్పయాచార్యవిజయము | ... | 0 | 4 | 0 |
| 2 | కరణీకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి [సింహాద్రి వెంకటాచార్యులు] | | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతులు [సుమతిశతకమునకు సంస్కృతము] | ... | 0 | 2 | 6 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 9 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 10 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము [పత్రికాధిపతి] | ... | 0 | 4 | 0 |
| 11 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 12 | గురిగింజ | ... | 0 | 1 | 0 |
| 13 | పునర్వివాహము [పత్రికాధికతి] | ... | 0 | 4 | 0 |
| 14 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 15 | శివానందలహరి [లంకాడ రామకృష్ణకవి] | ... | 0 | 4 | 0 |
| 16 | లక్ష్మీవిలాసము [రాయసము వెంకటపతి] | ... | 0 | 4 | 0 |
| 17 | నర్సారావుపేట శతావధానము [తిరుపతివెంకటీయము] | | 0 | 3 | 0 |
| 18 | పథ్యంపథ్యం | ... | 0 | 2 | 0 |
| 19 | పత్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 20 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 21 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 22 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 23 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 24 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 25 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 26 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 27 | స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము | ... | 1 | 0 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము,
జానపాడు, పిడుగురాళ్ళపోస్టు.
గుంటూరుజిల్లా.